**ఓం నమః శివాయ**

*వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే*
*జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ ||*

*సదాశివసమారంభాం వ్యాసశంకర మధ్యమాం*
*అస్మదాచార్య పర్యంతాం*
*వందే గురుపరంపరాం||*

సంకలనం: రం. మురళీధరరావు

# పురుషసూక్తము - ఆంతర్యము



వేదాలే మానవుని నోట వెడలిన మొదటిమాటలు."**Veda is the First word uttered by man" గ్రిఫ్ఫిత్ అనే** మహాశయుడు బ్రిటిష్ పరిపాలన కాలంలోనే అన్నాడు. నాలుగు వేదాల ఆత్మ పురుషసూక్తం. ఇది సర్వదేవతాస్వరూపం. మిగతా దేవతలు ఆయనకు అంగాలే. ఆయన వేద

పురుషుడు.

ఈయన బ్రహ్మ కాదు. విష్ణువు కాదు. రుద్రుడు కాదు. ముప్పురకునూ అతీతుడు."విరాట్".

సృష్టి కి ముందు ప్రళయముకు తరువాత కూడా ఉంటాడు ఈ పరమాత్మ. అవాఙ్మానస గోచరము."**ఏకమేవ అద్వితీయమ్ బ్రహ్మ**"




- 

ఉదా: భారతం - వ్యాసుడు

- **"నారాయణాత్ ఋషిగణాః ,తథా సిద్ధ మహోరగాః. దేవా దేవ ఋషయశ్చైవ...."** ఆ పరమాత్మ నుండే మిగతా దేవతలు. ఆ యా దేవతలు ఆ విరాట్ పురుషుని ఏఏ అంగములో పురుషసూక్తము వర్ణించింది. మంత్ర పుష్పములో **"స బ్రహ్మ స శివః సేంద్రః సోక్షరః పరమస్వరాట్** ...... అని విరాట్ సర్వదేవతా సార్వ భౌముడని చెప్పింది.

పరమాత్మ. అంటే

ఒకసారి సూర్యోదయం అవుతోంది. జనం నిద్ర లేస్తున్నారు. లేస్తూనే నేను ఆ పని చేయాలి. ఈ పని చేయాలి అని ప్రప్రథమంగా జీవజాలంలో కలిగే భావనయే. "**నేను**".

కనిపించే సూర్యుడు "**రెండు**". ఆ సూర్యునే మనం సర్వ సాధారణంగా భగవంతుడు, ప్రత్యక్షదైవం అంటాం.సరే.

కాని ఆసూర్యుని వెనుక అనేక సూర్యులు ఉన్నారు. వాటికి ఆవల వీటిని నడిపే పరమాత్మ ఉన్నాడు. ఆయన అసలు **ఆదిత్యుడు**. ద్వాదశాదిత్యులను కూడా నడిపే ఆత్మశక్తి పరమాత్మ.

***పరమాత్మ - అఖండవెలుగు***

భాగవతంలో

" లోకంబులు లోకేశులు
లోకస్థులు తెగిన తుది నలోకంబౌ పెం
జీకటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెలుగు నతనినే సేవింతున్. - **గజేంద్ర మోక్షం**

1.లోకాలు మూడు. మెలకువ, కల, నిద్ర,

2లోకేశులు ఈ మూటికి ఆధార భూతమైన చైతన్య పరిధులు. 3. విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు.

3. లోకస్థులు = మూడు లోకాలను అనుభవించేవి = ఇంద్రియాలు (కర్మ, జ్ఞాన)అంతఃకరణములు

4. తెగిన తుది = అంటే ఇవేవీ అందుకోలేని

5. అలోకంబగు పెన్జీకటికవ్వల= శూన్యావస్థను కూడా మించి ఎవడైతే ఉన్నాడో

6. ఏకాకృతి వెలుగు = నిర్వికల్పం, నిశ్చలం, ముల్లోకాంతర్యామియై న ఏకాకృతిగా

7.వెలుగు= కనిపిస్తాడో
అలాంటి పరమాత్మను ప్రార్థిస్తాను.

***వివరణ***

మన పురాణాల్లో ప్రస్తావించబడుతున్న, నేటి శాస్త్ర పరిశోధకులు వివరిస్తున్న అనేక లోకాలు ఒకానొక దశలో ఉండవు. ఈ కోటానుకోట్ల సూర్యుళ్లూ అంతరిస్తారు. మనం చూస్తున్న మహాసముద్రాలు, బృహత్ పర్వతాలు, అగమ్య అరణ్యాలు, 84 లక్షల జీవరాశులు, జంగమ, స్థావరములు, విశ్వాంతరాళాల్లోని పాలపుంతలు, స్వర్గ, నరక లోకాలు ఇవేవీ ఉండక సమసిపోతాయి. అవధుల్లేని, ఎల్లలు లేని ఈ ఆకాశమూ ఉండదు. మనం గణించే ఘడియ, విఘడియలు, శత, సహస్ర యుగ మన్వంతరం లాంటి కాల ప్రమాణాలు ఉండవు. **'అవిశ్వం'** ఏర్పడుతుంది. నిర్వచించరాని **అంధకారము** ఏర్పడుతుంది. ఇలాంటి వాటికి ఆవల **'ఒక శేషత్వం'** ఉంటుంది. అది **'అనాది మధ్యం' లేనిది. అది పురుష స్త్రీ నపుంసక కాదు. ఆది, అంతము అందులోనే అణగి ఉంటుంది. ఇది పరమాత్మ శక్తి**

ఆ **శక్తి** విశ్వాన్ని వెలువరించగలదు, ఇముడ్చుకోగలదు. నిష్కళంకమై, అన్నింటికీ సాక్ష్యమై ఉంటుంది. ఆ శక్తికి రూపం, రసం, గంధం ఉండవు. జనన మరణాలుండవు. ఆ శక్తి నామగోత్ర పరిచయ శూన్యం. వర్ణరహితం. పాప,పుణ్య రహితం, తత్వ రహితం, సహజమై ఉంటుంది. మానవ మేధస్సుకి అందని మహాద్భుత తేజస్సు ఏకాకృతిన వెలుగుతుంటుంది. అట్టి మహత్తర శక్తిని ఆరాధించుచూ, సేవించుకొనుచున్నాను అని గజేంద్రుడు ఆ శక్తిని వేడుకున్నాడు.

" ఒకపరి జగముల వెలినిడి
యొకపరి లోపలికి గొనుచు నుభయము దానై
సకలార్థసాక్షి యగు న  య్యకలంకుని ఆత్మమయుని నర్థి దలంతున్.

ఒకసారి లోకాలను బయట ఉంచుతాడు. మరొకసారి లోపల ఉంచుకుంటాడు. మరలా ప్రపంచాన్ని చూపుతుంటాడు. అంతలోనే మాయం చేస్తాడు. రెండూ తానే ప్రపంచ సంగతులకు సాక్షి. నిర్దోషి. మచ్చలేనివాడు. ఆ విశ్వమే ఆత్మగా నిండిన ఆ పరమాత్మను నేను కొలుస్తాను.

భగవద్గీత లో శ్రీ కృష్ణ పరమాత్మ అర్జునునకు అవ్యయమైన, అప్రమేయం అయిన నానాత్వ భాసి యగు పరమాత్మను తనలో చూపిస్తాడు.

**అందులో ద్వాదశాదిత్యులు, వసువులు, రుద్రులు, ఆదిత్యులు మండలత్రయ పర్యంతం వ్యాపించిన భూర్భువస్సువర్లోక వ్యాప్తిగాంచిన పితృ, పితామహ, ప్రపితామహాదులను, ఏకాదశరుద్రులను, అష్టవసువులను, సప్తమరుత్తులను, అశ్వనీ దేవతలను, సర్వోత్కృష్టములగు విశ్వరూపాన్ని చూపిస్తాడు. ఆయనే పురుషోత్తముడు.**

గీతలో

**"అనాదిమధ్యాన్త మనంతవీర్యం**
**అనంత బాహుం శశిసూర్యనేత్రమ్**
**పశ్యామి త్వాం దీప్త హుతాశ వక్త్రం**
**స్వతేజసా విశ్వమిదం తపంతం"**

అని అర్జునుడు దర్శించిన రూపమే ఈ పురుషసూక్తము లోని పరమాత్మ.

**" యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ"**
అని తైత్తిరీయం వర్ణించలేకపోయిన పరమాత్మ.

**" ప్రజ్ఞానం బ్రహ్మ - తత్త్వమసి - అహంబ్రహ్మాస్మి - అయమాత్మా బ్రహ్మ - ఆనందో బ్రహ్మ"** అని ఉపనిషత్తులు ప్రతిపాదించిన మహా వాక్య స్వరూపుడు ఈ పరమాత్మ.

## పురుషసూక్తము-యజ్ఞపురుషుడు

***"పురుషః = పరమేశ్వరః ఇదం సర్వం జగత్స్వరూపేణ పూరయతి వ్యాప్నోతి తస్మాత్ సః పురుషః" అనివిద్యారణ్యులవారు ఋగ్వేదభాష్యంలో వచించారు.***

***పూరయతి ఇతి పురుషః***

1. *పురుషుడు = నవద్వారములతో ఉన్న పురమునందు శయనించువాడు పురుషుడు.*
2. *సకలజీవులందునూ "నేను" గా భాసించే ఆత్మరూపుడే పురుషుడు.*
3. *జగత్తంతా నిండిన అంతర్యామి పురుషుడు.,' అంతర్బహిశ్చ తత్సర్వమ్ వ్యాప్య నారాయణః స్థితః*
4. *బహు పురాతనమైనవాడు పురుషుడు.*
   *"యః పురా ప్రళయే ప్రాప్తే, నష్టే స్థావర జంగమే, ఏకః తిష్ఠతి విశ్వాత్మా" పురాతన పురుషుడు.*

**సృష్టి**

పైన వివరించిన "ఏకాకృతియై వెలుంగు" - పరమాత్మ.

ఆయన ప్రేరణే పిండాండము, బ్రహ్మాండము. దీనిలో అది ఉంది. దానిలో ఇది ఉంది. భగవంతుడు నిర్గుణుడు. ఆయన మొదట బ్రహ్మాండాన్ని నిర్మించాడు.బ్రహ్మాండం అంతా జలమయం. 1000 సంవత్సరాలు గడిచింది. అపుడు ఆయన నుండి "***విరాట్పురుషుడు***" ఉదయించాడు.

ముఖంనుండి> అగ్ని

సప్తధాతువులు > త్రిష్టుప్, అనుష్టుప్, ఉష్ణిక్, బృహతీ, పంక్తి, జగతి, గాయత్రీ 7

చెవులు > ఆకాశము

.

***దేవతల పుట్టుక***

ముఖము > అగ్ని, ఇంద్రుడు
ప్రాణము > వాయువు
నేత్రాలు > సూర్యచంద్రులు
ఉపస్థ. > ప్రజాపతి
గుదము > మృత్యువు
హృదయం> లక్ష్మి
నాభి > బ్రహ్మ > సనకసనందనాదులు

***పిండాండ వర్ణన***

శరీరంలో ఉండే జీవుడే పిండాండము. బ్రహ్మాండము, పిండాండము రెండూ

ఒకటే. ఈ అనుభూతికి ఆటంకం కలిగించేదియే " ***మాయ***".

నారాయణుడు>బ్రహ్మ

నారాయణుడు> సూర్యుడు> సూర్య పుత్రుడు> వైవస్వత మనువు.

ఇలా ఒకరు మరొకరికి చెప్పారు.

***మానవుడు***

96 అంగుళాల మానవుడు

వెన్నెముక > మేరువు

అడుగున మూలాధారము ( మూలకందం) 72,000 నాడులు

72,000> 14 ప్రధాన నాడులు (పాడ్యమి నుండి చతుర్దశి)-తిథులు - చతుర్దశమనువులు | > 14 నాడులు 14 దేవతలు

3 నాడులు

7 చక్రాలు

++++++++++++++++++++++++++++++++++++

***సూక్తము***

సు+ ఉక్తము = సూక్తము. లెస్సగా చెప్పబడింది. సూక్తాలు ఆరు విధాలు.

1.ఋషిసూక్తము 2.ఛందస్సూక్తము 3. దేవతా సూక్తము 4.అర్థసూక్తము 5.సంవాద సూక్తము 6.కామితార్థసూక్తము.

ఇది దేవతాసూక్తము.

***ఆ విరాట్పురుషుని అనంతరూపాన్ని వర్ణించేది పురుష సూక్తము. ----1***

***శరీరములో జరుగు చక్రాకారమగు అంతర్యాగమును వర్ణించే విధానమే పురుష సూక్తము. --------2.***

దీని ప్రారంభంలో

" ***ఓం తచ్చం యోరా వృణీమహే, గాతుం యజ్ఞాయ గాతుం యజ్ఞపతయే........దైవీ స్వస్తిరస్తు నః , స్వస్తిర్మానుషేభ్యః, ఊర్ధ్వం జిగాతు భేషజమ్, శన్నో అస్తు ద్విపదే, శం చతుష్పదే, ఓం శాంతిః శాంతిః శాంతిః***

ఇది **ప్రపంచశాంతి మంత్రము.**

**భావము:-**

**ఆవృణీమహే = ప్రార్థిస్తాము.**
**1.మంగళం కలిగించే భగవంతుని ప్రార్థిస్తాము**
**2. యజ్ఞం చక్కగా సాగాలని గానం చేస్తున్నాం.**
**3.యజ్ఞకర్తకు సుఖంకలుగాలి.**
**4.దేవతలు శుభం కలిగించాలి.**
**5. మానవులకు మేలు కలగాలి**
**6.బేషజమ్ = చెట్టూ చేమలు ఊర్ధ్వంగా పెరగాలి.**
**7.రెండుకాళ్ళజీవులకు శుభం కలుగాలి.**
**8. పశువులకు శుభం కలుగాలి.**
**9. ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక ప్రతిబంధకాలు లేకుండా ఉండాలి.**

**"సహస్ర శీర్షాపురుషః సహస్రాక్షః సహస్రపాత్**
**స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠత్ దశాంగులమ్" అని పురుష సూక్తాన్ని ప్రారంభిస్తారు.**

**దీని** మొదటి వర్ణం " స ".

శ్రీసూక్తం
" **హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజాం"** అని ప్రారంభం అవుతుంది. ఇందు 15 ఋక్కులు ఉన్నాయి. 15 ఋక్కులు పంచదశి మంత్ర ప్రతీకలు.

మొదటి వర్ణం "హి" అనగా " హ"

పురుషసూక్త మొదటి వర్ణం " స.

శ్రీ సూక్తం మొదటి వర్ణం " హ" = స - హ= కలిపితే "సోహం" వచ్చింది.

అంటే పురుష, శ్రీ సూక్తాల సమాహారం "సోహం"

" సోహం" లో 'స' కార, 'హ' కారాలను తొలగిస్తే, " ఓం" ప్రణవం ఏర్పడుతుంది.ఇది సహస్రారోపాసన. ప్రణవపరబ్రహ్మోపాసన.
స= ఉచ్ఛ్వాస - ఈశ్వర వాచకము

హ=నిశ్వాస.  -  జీవ వాచకము.

## పారాయణ పద్ధతి - తంత్ర విద్య

**శుక్ల పక్షంలో** ఒక శ్రీ సూక్త ఋక్ + పురుషసూక్త ఋక్ = ఇలా రెండు సూక్తాలు
**కృష్ణ** పక్షంలో  ఒక పురుషసూక్త ఋక్ + ఒక శ్రీ సూక్త ఋక్ = రెండు సూక్తాలు.

++++++++++++++++++++

## పరమాత్మ - జీవాత్మ - స్వరూపం -(పురుషుడు)

**ఓమ్**
**సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్**
**స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠద్దశాంగులమ్||**

**తాత్పర్యము:-**

**వేదపురుషుడు పరమాత్మ. ఆయనకు 1000 తలలు.1000 కళ్ళు. వేయి పాదాలు. ఇలా ఈ భూమి అంతా అనేక రూపాలలో వ్యాపించియున్నాడు. దశాంగులములు అంటే పది ప్రేళ్ళ లేదా పది అంగుళాల పొడవున అధిగమించియున్నాడు.**

### పరమాత్మ

1. **పరమాత్మ - వేద పురుషుడు**
2. **జీవాత్మ - సహస్రార పురుషుడు.**
3. **సమస్తజీవరాశులే సహస్ర శీర్షాలు, అనంతాలు.**
4. **స భూమిం =  పరమాత్మ జల,వాయుతేజో...సప్తావరణలు దాటి,**
5. **భూమి>10 times జలం**
   **జలం> 100 అగ్ని> 1000 వాయువు>10,000>ఆకాశము> 100,000 మహత్తు**

   **>యావద్విశ్వంలో ఆవరించి యున్నాడు.**

- దశావతారాలు

జీవాత్మ

6. జీవుడు భూమిపై ఉన్నాడు. అసంఖ్యాక జీవులలో ఉన్నాడు అదే సహస్ర శీర్షత్వం, పాదత్వం
7. దశమాసాలు గర్భం
8. దశాంగుళమ్ = దశమాసాత్మక శిశువు
9. దశావతార పరమాత్మ.
10. నారాయణసూక్తంలో "పరమాత్మ బ్రహ్మజ్యోతి స్వరూపంగా" మానవ శరీరాలలో నాభికి పైన 10 అంగుళాల దూరంలో హృదయకుహర మధ్యంలో ప్రకాశిస్తూ ఉన్నాడు. ఉదా: శ్రీ కృష్ణుడు - అర్జునుడు.

ఈ పురుషసూక్తం ఒక యజ్ఞం. అది సంవత్సరం."యజ్ఞః సంవత్సరః"- "యజ్ఞో వై విష్ణుః"
అనేక తలలు, అనేక పాదాలతో
భగవంతుడు భూమిని అంతటా వ్యాపించి, 10 అంగుళాల పరిధిలో వ్యాపించియున్నాడు. అమేయుడు. అప్రమేయుడు.

+++++++++++++++++++-+++

## సర్వ సాక్షి - పరమాత్మ

2. పురుష ఏవేదగ్ం సర్వమ్ యద్భూతం యచ్చ భవ్యమ్|
ఉతామృతత్వస్య ఈశానః యదన్నేన అతిరోహతి||

తాత్పర్యము:-

జరిగిపోయిన దానికి, జరుగబోవు అంశమును అంతటిని ఇపుడున్న పురుషుడే చూస్తున్నాడు. అతడు స్వర్గంలోని అమృతానికి అధిపతి.
అనగా త్రికాలాలకు సాక్షి. అనగా అమృతుడు.నిత్యసత్యవర్తి. అసంఖ్యాక జీవుల అంతర్యామి. కొన్ని గతించవచ్చు. కొన్ని రావచ్చు. అన్నింటినీ పరమాత్మ గా, ఆత్మగా సాక్షియే.

## పరమాత్మ మహిమ

3. ఏతావానస్య మహిమా | అతో జ్యాయాగ్ంశ్చ పూరుషః
పాదోస్యవిశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి||

తాత్పర్యం:- త్రికాలవర్తి. అమృతమూర్తి. ఇది ఆయన మహిమ.
ఇంతకంటే కూడా మహోన్నతుడు.
ఎందుకంటే మనం చూసే విశ్వంలోని జీవులు ఆయనలో నాలుగో భాగమే.
¼ మాత్రమే.
ఇంకా ¾ మూడు పాళ్ళు ఇంకా దేవలోకంలో అమృతమై ఉంది. శాశ్వతం మూడు పాళ్ళు. అశాశ్వతం ¼. మనం చూసే విశ్వం కంటే ఇంకా మూడు రెట్లు దేవలోకంలో ఆ పురుషుడు అమృతుడై ఉన్నాడు.

## పరమాత్మ:-

మనకు కనిపించేది అంతా భగవన్మహిమయే. ఆయన విభూతియే. సర్వస్వం కంటే శ్రేష్ఠుడు. విశ్వానికే ఆధారం. కనిపించే విశ్వమంతా ఆయనలో ¼ భాగమే. ¾ భాగంలో ఆయన ఇంకా వ్యాపించియున్నాడు. ఆయన నశ్వరుడు.ఆయనకు సృష్టి ప్రళయాలు లేవు.

జీవుడు

మెలకువ = 1/4

మిగతా మూడు ¾(స్వప్నం-సుషుప్తి-తురీయం)¼+¾
+++++++++++++(+(+++

## పరమాత్మ వ్యాప్తి

4. త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః
పాదోస్యేహా భవేత్ పునః
తతో విష్వఙ్వ్యక్రామత్
సాశనా అశనే అభి ||

పరమ పురుషుడు ¾ వంతు పైన బ్రహ్మాండానికి ఆవల నెలకొని ఉంటాడు.తరగడు.

ఆయనకు కలిగిన సంకల్పమే ¼ భాగం.

¼ భాగం మాత్రమే మనకు కనిపిచే ప్రపంచం. ఇదే సర్వలోకాలుగా భాసిస్తోంది. అంటే 14 లోకాలూ ఆ పరమపురుషునకు ¼ మాత్రమే.

ఈ కనిపించే భాగం రెండు విభాగాలు. అన్నాదులు తిని జీవించేవి ఒక భాగం.ఉదా: జీవుల జననం

తిననివి మరో భాగం.అనగా మరణం.

ఈ రెంటికి అనగా జనన, మరణాలకు అతీతంగా ఆ పరమాత్మ ఆవల ఉన్నాడు.

ప్రహ్లాదచరిత్ర:-

"ఇందు గలడందు లేడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుండు
ఎందెందు వెదకి చూచిన
యందందే గలడు దానవాగ్రణి! వింటే.

ఉదా: 1. హిరణ్యకశిపుని సంహరించడానికి స్తంభంలో నరసింహస్వామి అవతరిస్తాడు.

2. యశోద నోరు తెరిస్తే కనిపిస్తాడు పరమాత్మ.

3.శ్రీ కృష్ణుని హృదయంలో అర్జునుడు ఆయన విశ్వరూపాన్ని చూసాడు.

4. వామనుని త్రివిక్రమత్వమే ఆ పరమాత్మ స్థితి ¾.

జీవాత్మ

ఆయన స్థావరాల్లో జంగమాల్లో అంతటా జొరబడి ఉన్నాడు.

++++++++-+----+++++--+++--

## సృష్టి - ఒక యజ్ఞ ప్రక్రియ

5.తస్మాత్ విరాడ జాయత
విరాజో అధిపూరుషః|
స జాతో అత్యరిచ్యత
పశ్చాద్భూమిమథో పురః||

తాత్పర్యం:-

1.పైన చెప్పిన త్రివిక్రమత్వం ప్రదర్శించిన పరమాత్మ నుండి " విరాట్" గా అవతరించింది. విరాట్ అంటే వెలుగుల ముద్ద. ఆ వెలుగుల ముద్దయే "విరాట్పురుషుడు" అనగా రజోగుణరహితుడు.(తండ్రి.)

2.ఆ విరాట్ పురుషుని నుండి బ్రహ్మాండం పుట్టింది.
ఈ బ్రహ్మాండంనుండి పురుషుడు జీవులుగా ఉద్భవించాడు. అలా బ్రహ్మ పుట్టి అంతటా ఆవరించాడు. వెనుకా, ముందూ, ప్రక్కా అంతటా వ్యాపిస్తూ, ప్రాణులకు శరీరాలను సృష్టించాడు. పురుష సూక్తంలో రెండు రకాల సృష్టి జనించింది.(కుమారుడు)

సాయనాచార్యుల కథనం.

1. పూర్వసృష్టి
   ఇందు ప్రపంచం, దేవతలు, ప్రాణులు సృష్టించబడ్డాయి. ఇప్పటివరకు చెప్పింది పూర్వసృష్టి.

2. ఉత్తరసృష్టి
   తరువాత మంత్రాలలో వస్తుంది.
   ఇందు ప్రాణుల ఆహారం, ఇతర పదార్థాలను సృష్టించాడు. ఇదంతా ఒక యజ్ఞం.
   +++++++++++++++++

## ఉత్తర సృష్టి

6. యత్పురుషేణ హవిషా

దేవా యజ్ఞమతన్వత|
వసంతో అస్య ఆసీత్ ఆజ్యమ్,
గ్రీష్మ ఇధ్మః, శరద్ధవిః||

## విరాట్పురుషుడు -1.

యజ్ఞపురుషుడు - పరమాత్మ (First)

యజ్ఞః సంవత్సరః.
యజ్ఞో వై విష్ణుః.
కాలోస్మి లోకక్షయకృత్ లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః
++++++++++++++++++++++++++++++++++++

ఈ ఉత్తరసృష్టి ఒక యజ్ఞం. (Second person)
ఈ సృష్టి కల్పనలో పురుషుడు(పరమాత్మ) జీవుడుగా పుడుతుంటే, ఆ జీవునకు అంగంగా దేవతలంతా ఆ జీవునిలోంచి మేల్కొన్నారు.( జీవుడే దేవుడు కదా! దేహాంగాలే దేవతలు. వారు మేల్కొన్నారు.)

దేవతాస్థితి. -౧

మేల్కొన్న దేవతలు యజ్ఞం చేయ తలపెట్టారు. మొదటి యజ్ఞం ఆ యజ్ఞమే సంవత్సర స్వరూపం.

1. ఆహుతి ద్రవ్యం భగవంతుడే.First విరాట్ ఆహుతి యజ్ఞానికి హవ్యం( పురుషుడు జీవుడగుటయే ఆహుతి)
2. వసంతకాలం నెయ్యి.( అగ్నిని ప్రకాశింపజేసేది)
3. గ్రీష్మం సమిధలు.(కలుషాలు సమిధలు,ఎండిన)

++++++++++++++++++++++++++++++++++++

## జీవస్థితి.-౨

4.శరత్కాలం నైవేద్యం.(పంటలు) హవిస్సు. Second person కు శరత్తు హవిస్సుగా పనిచేస్తుంది..ఇదంతా ఒక కవితా కల్పమే.

--------------------------------

## యజ్ఞ నిర్వహణ

7. సప్తాస్యసన్ పరిధయః
త్రిస్సప్త సమిధః కృతాః
దేవా యద్యజ్ఞం తన్వానాః
అబధ్నన్ పురుషమ్ పశుమ్

తాత్పర్యం:-
దేవతలు తలపెట్టి విస్తరించే ఈ యజ్ఞంలో పరమాత్మను బలిపశువుగా బంధించిరి. అటువంటి యజ్ఞానికి 7 ఆవరణలు ఏర్పాటు చేసారు.21 సమిధలను ఏర్పాటు చేసారు.

7 పరిధులు, 21 సమిధల వివరణ
యజ్ఞం సంవత్సరం.

పరమాత్మ

ఈ యజ్ఞానికి పరమాత్మ పరంగా
పరిధులు 7.
(పంచభూతాలు + రాత్రి, పగలు)
7. గ్రహాలు అని కూడా.
7 వారాలు

కాల పరంగా
7 ఛందస్సు లు 7 పరిధులు
త్రిష్టుప్, గాయత్రి,...
7 రకాల అచ్ఛాదనలు. 7 రకాల ఛందోమంత్రాలు. 7 circles.

యజ్ఞశాలలో ఆహవనీయాగ్నికి 3 పొరలు.3 వేదికలు,ఆత్మ ఆదిత్యుడు = 3+3+1= 7

తత్త్వాలు 21.
12నెలలు+6 ఋతువులు+ ముల్లోకాలు 3 = 21.
7 భౌతికదృష్టి

7 మానససృష్టి
7 దివ్యసృష్టి.

బ్రహ్మ బలి పశువు. (ముడిసరుకు)
పురుష సూక్తంలో సృష్టి ఒక యజ్ఞం.
+++++++++
అంతర్యాగం:

జీవాత్మ
జీవుడు పుట్టడం మరణించడం యజ్ఞపశుత్వం

పరమాత్మ రూప జీవుని శరీరంలో బంధించి,పరమాత్మను యజ్ఞపశువును చేసారు.
పంచభూతములు+ అహంకారం + బుద్ధి= 7

భూతాలు 5
తన్మాత్రలు 5
జ్ఞాన, కర్మ. 10
మనసు + 1 = 21.
++++++++++++++++++++++

సృష్టి యజ్ఞం

8. తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్
పురుషం జాతమగ్రతః
తేన దేవా అయజన్త
సాధ్యా ఋషయశ్చ యే||
బర్హిష్షులు= దర్భలు.

తాత్పర్యం:-
మొదటగా హిరణ్యగర్భునినుండి పుట్టిన పురుషుడు యజ్ఞపురుషుడు. విరాట్ నుండి జనించిన జీవుడు.
ఆ జీవుని యజ్ఞ పశువుగా బంధించారు. వానిపై దర్భలతో చిలికి,

సాధ్యులు,దేవతలు,ఋషులు అర్చించారు.
 మొదటి పురుషుని జీవాత్మలో బంధించి, సృష్టి యజ్ఞం చేసారు.

ఈ పురుషుడే చతుర్ముఖ బ్రహ్మ

సాధ్యులు:

 సృష్టికి సాధన భూతమైన అంతశ్శక్తులు. సృష్టి ని అవ్యక్తంగా ఉన్న దానిని వ్యక్తం కావించే వారు.

దేవతలు:-
 సృష్టి ద్రవ్యానికి అధికారులు. వీరు ఇంద్రియాలలో ఉంటారు.

 ఋషులు:-
 జ్ఞానస్వరూప శక్తులు.మంత్రద్రష్టలు.
బర్హి= ప్రకృతి.
--------------------------------------

శుక్రము - పృషదాజ్యమ్

9. తస్మాత్ యజ్ఞాత్ సర్వహుతః
 సంభృతం పృషదాజ్యమ్
 పశూగ్ంస్తాగ్ం శ్చక్రేవాయవ్యాన్
 అరణ్యాన్ గ్రామ్యాశ్చ యే||

తాత్పర్యం:-

 ఆ యజ్ఞాన్ని సర్వహుతము అంటారు. పెరుగు చిలికితే వెన్న వస్తుంది.నవనీతం. ఇదే సృష్టి యజ్ఞంలో జీవునినుండి వెలువడిన శుక్రం. ఆ శుక్రం నుండి యజ్ఞపురుషుడు సకల జీవరాశులను పుట్టించాడు. వానిలో వాయుచరాలు, పశువులు, గ్రామ్య జంతువులు వెలువడ్డాయి.

సారాంశం: చతుర్ముఖబ్రహ్మ సృష్టి చేసాడు. బీజ ప్రాయాన ఉన్న నానావిధ ప్రకృతి

జనించింది.
పురుషమేధము=శుక్రము
పృషదాజ్యమ్= పెరుగు చిలికిన వెన్న. ( పెరుగు + పాలు) = శుక్ల శోణితాలు)చిలుకగా వచ్చిన వెన్న.
--------------------------------------

"సర్వహుత" యజ్ఞము

10.తస్మాత్ యజ్ఞాత్ సర్వహుతః
ఋచః సామాని జజ్ఞిరే
ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్
యజుస్తస్మాదజాయత ||

తాత్పర్యము:-
ఈ యజ్ఞ మూర్తి పేరు "సర్వహుతము". ఈతడు దేవతలు చేసే యజ్ఞానికి సంతృప్తి చెందాడు. ఆ యజ్ఞమునుండి ఋక్కులు, సామములు, ఛందస్సులు పుట్టినవి. యజుర్వేదం కూడా పుట్టింది.

వివరణ
ఈ యజ్ఞం లో వేదాలు 3 పుట్టినవి.వేదాలు అనగా అఖండవాక్కు.

1. ఋక్కు:- ఇది సంకల్ప సంభవం. స్తుతిరూపం.ఉచ్చరింపబడేటపుడు వెలువడే వాక్కు.
2. సామము:-
ఇది గానరూపంలో ఉంటుంది. ఉచ్చరించబోయే ముందు కలిగే ప్రాణస్పందనమే సామము.
3. యజుస్సు:-
వాక్కులోని అనుభవమే యజుస్సు.ఉచ్చరించు విధానంలో గల అనుభవం కూడా అదే.
4. ఛందస్సు:- అక్షరగణనము, తాళలయలు, గతులు " ఛందస్సులు.
5. ఈ మూడు వేదాలు ఒక్కుమ్మడిగా పలుకుతుంటే అందుండి "ప్రణవోపాసన" వ్యక్తం అవుతుంది.

జీవపరం
జీవి జనించే వేళ కలిగే సంకల్పం కంఠధ్వని అయితే "ఋక్కు"

ధ్వని ఉచ్ఛరించునప్పటి శ్వాస "సామ" ము.
శ్వాసబలంతో చైతన్యంగా వెలువడే వేళ "యజుస్సు"
ఇవి జగతి, త్రిష్టుప్, గాయత్రి... వగైరా ఛందస్సులు వ్యక్తమగును.

----------------------------------------

## వివిధరకాల జంతు సృష్టి

11. తస్మాదశ్వా అజాయంత
యే కే చోభయాదతః
గావో హ జజ్ఞిరే తస్మాత్
తస్మాజ్జాతా అజావయః ||

తాత్పర్యము:-
ఆ యజ్ఞం నుండి యే గుర్రాలు పుట్టాయి.గాడిదలు, ఒంటెలు, గోజాత్యాదులు, గొర్రెలు, మేకలు మొదలగునవి పుట్టినవి.
ఇవి కాలచక్రపు ఆరంభరూపములు. రాశిచక్రరూపాలు.
ప్రజాపతులు గ్రహాలను, పంచభూతాలను సృష్టించిన వెనుక గ్రహాకారంలో ఈ జంతువులు జనించినవి. ఇవి రాశి చక్రమునగల రూపములు. ఈ జంతువులు సంవత్సరం లోని ఋతుధర్మములను సూర్య కిరణాలు సోకి వర్తింపజేయును. ఆ యా ఋతువులలో జంతువుల రూపంలో వాని మాతృగర్భమున జీవుడు ప్రవేశించును.

## యజ్ఞపురుష జీవ సృష్టి

12.యత్పురుషం వ్యదధుః
కతిథా వ్యకల్పయన్
ముఖం కిమస్య కౌ బాహూ
కావూరూ పాదా వుచ్యేతే ||

తాత్పర్యం:-
ఆ యజ్ఞపురుషుడు ఎన్ని విధాలు? వాని ముఖం ఎలా ఉంటుంది? భుజములేంటి? తొడలేంటి? పాదాలేంటి? అని ప్రశ్నలు కలిగినాయి.

సర్వజన ధర్మాలు

13. బ్రాహ్మణోస్య ముఖమాసీత్
బాహూ రాజన్యః కృతః
ఊరూ తదస్య యద్వైశ్యః
పద్భ్యాగ్ం శూద్రో అజాయత||

తాత్పర్యం:-

1. బ్రాహ్మణుడు ఆ యజ్ఞపురుషుని ముఖము.
అనగా సత్యసంధత. బ్రహ్మచింతన, బ్రహ్మానుభూతి, లోకకల్యాణ తపస్సు.
2. క్షత్రియుడు బాహువులు.
దుష్టశిక్షణ, శిష్టరక్షణతో లోకరక్షణకు బాహువులు ఆవశ్యకములు.
3. వైశ్యుడు ఊరువులలో ఉండి,జనజీవనానికి కుక్షి నింపుతూ, నిత్యావసరాలను అందించి, సర్వ జన పరిపోషణ.
4. శూద్రుడు పాదములందు ఉద్భవించెను. మానవ నడకకు ప్రథమభూమిక శూద్రుడు. ఆహారోత్పాదనతో లోక కల్యాణమునకు తోడ్పడుట.

యజ్ఞపురుషుని నలువురు సంతానమూ, లోకకల్యాణ కారకులగుట. నలువురి ధర్మం ఏకమ్ లోకకల్యాణమ్. నలువురూ కలిస్తే "ఏకం సత్". యజ్ఞపురుషుని ధర్మం లోకకల్యాణమ్. మనం కూడా విశ్వహితానికి మనధర్మాలను రక్షించాలి. " ధర్మో రక్షతి రక్షితః" అని మనం రక్షింపబడుతాం ఇవి 4 మన ధర్మాలు. But not castes. భగవద్గీతలో కూడా ఇదే ధర్మాన్ని బోధించింది.

జీవులలో దైవాంశలు

14. చంద్రమా మనసో జాతః
చక్షోః సూర్యో అజాయత
ముఖాత్ ఇంద్రశ్చాగ్నిశ్చ
ప్రాణాత్ వాయురజాయత||

తాత్పర్యం:-

1. యజ్ఞ పురుషుని మనస్సునుండి చంద్రుడు జనించాడు.

2. నేత్రమునుండి సూర్యుడు జనించాడు
3. ముఖము నుండి 'ఇంద్రాగ్నులు' జన్మించారు.
4. ప్రాణమునుండి వాయువు జన్మించెను.

ఆ దైవాంశల శక్తులే మన జీవన హేతువులు. ఇదే "దేహో దేవాలయో ప్రోక్తః జీవో దేవః సనాతనః" అంటే ఇదే.

జగన్మాత వర్ణనలో కూడా మన ప్రాచీనగ్రంథాలు, స్తోత్రాలు "సూర్య చంద్రులు" అమ్మకునేత్రాలని, స్తనాలని క్రాంతదర్శులు బోధించారు. కనుక మనను నడపించేది మనలోని దైవమే. కనుక జీవుడు దేవుడు.

## సర్వహుతము - లోకాల సృష్టి

15.నాభ్యా ఆసీదంతరిక్షమ్
శీర్ష్ణో ద్యౌః సమవర్తత
పద్భ్యాం భూమిః దిశః స్తోత్రాత్
తథా లోకాగ్ం అకల్పయన్||

తాత్పర్యం:-

యజ్ఞ పురుషుని నాభి అంతరిక్షం. శిరస్సు ద్యులోకము.
పాదములవలన భూలోకము.
చెవులవలన దిక్కులు.
ఇలా "సర్వహుతము" అనే యజ్ఞం ద్వారా దేవతలు లోకాలను సృష్టించారు.

## ప్రణవస్వరూపుడు - పరమాత్మ

16.వేదాహమేతం పురుషమ్ మహాంతం
సర్వాణి రూపాణి విచిత్య ధీరః
నామాని కృత్వా అభివదన్ యదాస్తే||

తాత్పర్యం:-

వేదపురుషుడు స్థిరుడు. అతడు సర్వజీవరాశులను సృజించాడు. వాటికి పేర్లు పెట్టాడు. భాషలను ఏర్పరచాడు. వానిని పలుకువాడే తాను. అతడు

ఆదిత్యవర్ణుడు. ఆ ఆదిత్యుని వ్యక్తం చేసేది"ఓం".అలా ప్రణవస్వరూపంగా వ్యక్తమయ్యే పరమపురుషుడు పెంజీకటికావల నున్నాడు.అతనిని నేను ఎరుగుదును.

అహమ్ వేద -

## అమృతత్త్వప్రాప్తి

17. ధాతా పురస్తాత్ యముదాజహార
శక్రః ప్రవిద్వాన్ ప్రదిశః చతస్రః
తమేవం విద్వాన్ అమృత ఇహ భవతి
నాన్యః పంథా అయనాయ విద్యతే||

తాత్పర్యం:-
బ్రహ్మ తన నాలుగు ముఖములనుండి ప్రణవరూపంలో వేదాన్ని ఉచ్చరిస్తాడు.
ఆ వాక్కులో 3 అవ్యక్తాలు. అనగా పరా-పశ్యన్తీ-మధ్యమా.గుహలో ఉన్నట్లు ఉంటాయి.

వ్యక్తము - వైఖరి ఒకటి.వినబడేది.

నాలుగూ వాక్కులోనే ఉన్నాయి.
ఈ విధంగానే మనకు కనిపించే ప్రపంచంకూడా ¼ వంతు మాత్రమే.

అయితే ఇంద్రుడు ఈ ¾ + ¼ = 1. ఈ నాలిగింటి రూపాన్ని నాలుగు దిక్కులుగా, దిక్కోణములుగా తెలిసికొని, అమృతుడు అయ్యాడు.

ఆ యజ్ఞ పురుషుని ఇంద్రుడులాగా ఎవరూ తెలిసికొంటారో ఆ మానవులు జీవన్ముక్తులు. ఈ అమృతత్త్వ సిద్ధికి ఇది ఒకటే మార్గము.
"సర్వమునందు ఈశ్వరుని దర్శించుట అమృతత్త్వము".

## మానవ జీవిత గమ్యం

18. యజ్ఞేన యజ్ఞ మయజన్త దేవాః

తాని ధర్మాణి ప్రథమాన్యాసన్
తేహ నాకం మహిమానస్సచన్తే
యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవాః||

తాత్పర్యం:-
దేవతలంతా
"సర్వహుతము" అను యజ్ఞాచరణలో యజ్ఞపురుషుని అర్చించిరి. అనగా
తమ సర్వస్వాన్ని యజ్ఞార్పణం గావించారు.

ఈ యజ్ఞం లో ఆచరించిన ధర్మాలే ప్రాథమికధర్మాలై ప్రమాణాలయ్యాయి.
ఇవే ప్రతి ప్రళయానంతసృష్టిలోని ప్రాథమిక ధర్మసూత్రాలు.
"ధాతా యథా పూర్వమ్ అకల్పయత్" అంటే ఇదే.
ప్రతిసృష్టికి ముందుదేవతలంతా శాశ్వతులై ఉంటారు. ఆ దేవతల అనుభూతి
యే జన్మసంసారజీవులు తరించే మార్గమదే. మరొకటి లేదు.
++++++++++++++++++++++++++++++++++++++++++++++++

13 వ అనువాకము

## పురుషుడు సృష్టి లో వర్తించుట

1. అద్భ్యః సంభూతః పృథివ్యై రసాచ్చ
   విశ్వకర్మణః సమవర్తతాధి
   తస్య త్వష్టా, విదధద్రూపమేతి
   తత్పురుషస్య వ్యాజానమగ్రే||

తాత్పర్యం:-
ముందు జలములు. జలములనుండి భూమి, భూమినుండి రసము. ఇలా
విశ్వకర్మ వల్ల జన్మించి వర్తించాడు.

త్వష్ట అనేవాడు విశ్వకర్మ గురువు. సూర్యుని మామ.సూర్యుని కిరణాలు భార్యలు
భరించలేకపోయారు.అపుడు త్వష్ట సూర్య కిరణాలను చెక్కాడు.
దేవతలు రెండు రకాలు. 1. ఆజాన దేవతలు 2. కర్మదేవతలు.
ఆజానదేవతలు సృష్టికి పూర్వమందున్నారు. వీరు అసంఖ్యాకులు. వీరి లోకము
ఆజానలోకము.

సర్వహుతము అనే యజ్ఞమును చేసినవారు ఈ లోకంలో నే శాశ్వతులౌతారు.

## అమృతస్వరూపుడు

2. వేదాహమేతం పురుషం మహాంతం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్
   తమేవం విద్వానమృత ఇహ భవతి,
   నాన్యః పంథా విద్యతేయనాయ ||

తాత్పర్యం:-

తాత్పర్యం:-

వేదపురుషుడు స్థిరుడు. అతడు సర్వజీవరాశులను సృజించాడు. వాటికి పేర్లు పెట్టాడు. భాషలను ఏర్పరచాడు. వానిని పలుకువాడే తాను. అతడు ఆదిత్యవర్ణుడు. ఆ ఆదిత్యుని వ్యక్తం చేసేది"ఓం".అలా ప్రణవస్వరూపంగా వ్యక్తమయ్యే పరమపురుషుడు పెంజీకటికావల నున్నాడు.అతనిని నేను ఎరుగుదును.

అహమ్ వేద -

## ధీరులు

3.ప్రజాపతిశ్చరతి గర్భే అంతః
అజాయమానో బహుధా విజాయతే
తస్య ధీరాః పరిజానంతి యోనిమ్
మరీచీనాం పదమిచ్ఛంతి వేధసః||

తాత్పర్యం:-

సృష్టి సంకల్పం పొందిన పురుషుడు ప్రజాపతి. ఇతడు గర్భస్థుడై తిరుగుతుంటాడు.
గర్భమంటే బ్రహ్మాండం. మొదటిది.నవబ్రహ్మలు వీరు.

అజుడు. అయినా అనేక జన్మలు ఎత్తుతుంటాడు.అపుడు ద్వితీయ పిండాండంలో 9 మాసాలు ఉంటాడు.

ఇలా బ్రహ్మాండం, పిండాండం రెండూ సమానమే.

పురుషునినుండి వచ్చి, మరల పురుషునిలోనికే పోవును. ఇలా బహుజన్మలెత్తును. ఇలా ఆత్మ జన్మ పరంపరను తీసుకుంటుంది.

ఈ జన్మ పరంపరకు తమకు ఆదియైన పరమాత్మను మహనీయులు మాత్రమే తెలిసికుంటారు.

సృష్టి సంకల్పం పొందిన ప్రజాపతులు జ్యోతి ర్మార్గాన పయనించ కోరుదురు.

మరీచులు: బ్రహ్మ పదము పొందగోరువారు.

## విరాట్పురుష వందనము

4. యో దేవేభ్య ఆతపతి
   యో దేవానాంపురోహితః
   పూర్వో యో దేవేభ్యో జాతః
   నమో రుచాయ బ్రాహ్మయే||

తాత్పర్యం:-

దేవతలకోసం వెలిగేవాడు, దేవహితుడు, సర్వదేవతలకాద్యుడు, స్వయం ప్రకాశకుడు, జ్ఞాన మయుడగు పురుషునకు నమస్కారం. శరీరంలో వెలుగు ఆయనయే.

## బ్రహ్మజ్ఞాని

5.రుచం బ్రహ్మం జనయంతః
   దేవా అగ్రే తదబ్రువన్
   యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్
   తస్య దేవా అసన్ వశే||

తాత్పర్యం:-

సృష్టికి ముందు దేవతలంతా బ్రహ్మతత్వంతో నిండిన వెలుగును చూస్తూ దేవతలిలా అన్నారు.

" నిన్ను తెలిసికొన్న బ్రహ్మజ్ఞానికి దేవతలు వశమందుంటారు.

## పరంధాముని స్వరూపం

6.హ్రీశ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ
అహో రాత్రే పార్శ్వే
నక్షత్రాణి రూపం అశ్వినౌ వ్యాప్తమ్
ఇష్టంమనిషాణ అముమ్మనిషాణ
సర్వం మనిషాణ ||

తాత్పర్యం:-

ఆ పరంధామునకు లజ్జ, లక్ష్మి ఇరువురు భార్యలు. రేయింబవళ్ళు ఇరు ప్రక్కలు.
నక్షత్రాలు ఆకారం. అశ్వినులు పెదవులు.
నేనిచ్చిన యజ్ఞాన్ని మన్నించు. నా అధీన విచయాలు
మన్నించు.మనోబుద్ధ్యహంకారాదుల మన్నించు.🌺🍁🍀🙏👏💙